హనుమంతవిలాస్ ప్రచురణములు 3

# గురుదక్షిణ.

గ్రంథకర్తలు.

కొడాలి వేంకటసుబ్బారావు

కామరాజుగడ్డ శివయోగానందరావు







ప్రకటనకర్తలు

## హనుమంతవిలాస్

శనివారపుపేట అండ్ పెదకళ్లేపల్లి



ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాల (లిమిటెడ్) యందు

క. కోదండరామయ్యగారిచే

ముద్రింపబడియె.

1925

 [వెల రు 0—10—0 లు

## రా జ పో ష కు లు.

1 శ్రీ. శ్రీ. శ్రీ. ఉయ్యూరు రాజావారు.
2 ,, ,, ,, మీర్జాపురపు రాజావారు.
3 ,, ,, ,, దివాన్ బహద్దరు మోచర్ల రామచంద్రరావు పంతులు గారు, బి, యే. బి. యల్.
4 ,, ,, ,, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు.

## పో ష కు లు

| | | | |
|---|---|---|---|
| 1 | శ్రీ | కొండపల్లి కోదండరామారావుగారు దేశముఖ్ | బూరదరాఘవపురం |
| 2 | ,, | దుగ్గిరాల వేంకట నృసింహంగారు, | శెనివారపేట. |
| 3 | ,, | మిరియాల నారాయణ గుప్తగారు | మధిర. |
| 4 | ,, | చందా కాంతయ్యగారు | ఓరంగల్. |
| 5 | ,, | కొడాలి శివరామకృష్ణరావుగారు | మదరాసు |
| 6 | ,, | మాజేటి వేంకటేశ్వరరావు గారు | బెజవాడ. |

## స హా య కు లు.

| | | | |
|---|---|---|---|
| 1 | శ్రీ | కావూరి కోదండరామయ్య గారు | మోపిదేవి, |
| 2 | ,, | డాక్టరు హెచ్. శంకరరావు గారు | సికింద్రాబాదు. |
| 3 | ,, | చెందుపట్ల రామన్న గారు | వరంగల్. |
| 4 | ,, | అకినపల్లి రత్తయ్య గారి రామన్న గారు | ,, |
| 5 | ,, | తిరుపతిగారి రాధాకృష్ణనాయుడుగారు | వెంకటగిరి. |
| 6 | ,, | ఆవుటపల్లి హనుమంతరావుగారు | బందరు. |
| 7 | ,, | తురగా వరసింగరావు గారు | ,, |
| 8 | ,, | పిల్లుట్ల ఆంజనేయులు పంతులుగారు | శెనివారపుపేట. |
| 9 | ,, | తల్లాప్రగడ వేంకట సుబ్బారావుగారు | ,, |
| 10 | ,, | నాగుబండి సత్యనారాయణగారు | కారేపల్లి. |
| 11 | ,, | యన్. వి. రాఘవరావు గారు | ,, |
| 12 | ,, | ఈశ్వరసింగు గారు | ,, |

| | | | |
|---|---|---|---|
| 13 | ,, | పరసా రామనాథంగారు | కారేపల్లి |
| 14 | ,, | పరసా రంగారావు గారు | శింగరేణి |
| 15 | ,, | రామసింగు గారు | జనగాం |
| 16 | ,, | జములాపురపు గోపాలరావు గారు | హనుమకొండ |
| 17 | ,, | కే. వి. పురుషోత్తమ రావుగారు | ,, |
| 18 | ,, | అమ్మనమంచి నరసింహం గారు | ఎర్రుపాలెం |
| 19 | ,, | ఆకినపల్లి పుల్లయ్య గారు | మధిర |
| 20 | ,, | వంకాయలపాటి వేంకటనారాయణ గారు | ,, |
| 21 | ,, | వంకాయలపాటి వెంకటప్పయ్య గారు | ,, |
| 22 | ,, | పుల్లఖండం వేంకటప్పయ్య గారు | ,, |
| 23 | ,, | జవ్వాజి వీరయ్య గారు | ,, |
| 24 | ,, | కొమ్మన వేంకటనాగయ్య గారు | వైరాప్రాజెక్టు |
| 25 | ,, | కొడాలి ఆంజనేయ శర్మగారు | పెదకళ్లేపల్లి |
| 26 | ,, | మాజేటి వేంకటసుబ్బారావు గారు | బెజవాడ. |
| 27 | ,, | మల్లెల శోభనాచలపతిగారు | నూజవీడు. |



# సంపాదకీయోపోద్ఘాతము



ఈగ్రంథకర్తలు బాల్యవయస్కులు. వీరు కవిత్వరచనకుఁ గడఁగుటకుఁ దగిన ప్రోత్సాహ మాదియందుఁ గలుగఁజేసినవాఁడను నేనే. కాలక్రమమున వారివారి శక్తిసామర్థ్యములచే నభివృద్ధిలోనికి వచ్చి వారి పెద్దలమగు మాకింత వన్నెఁ జేకూర్చుచున్నందులకు భగవంతుఁడీ బాలుర కాయురారోగ్యైశ్వర్యముల నభివృద్ధిపరచుచు నిట్టి యుద్గ్రంథరచనలకుఁ దగిన శక్త్యుత్సాహములొసఁగఁ బ్రార్థించుచు నీబాలకుల నాశీర్వదించుటయే నావిధి. రచనాసామర్థ్యములనుగూర్చి విమర్శించు భార మాంధ్రపండితలోకమునకు వదలుటయు కర్తవ్యముగాని వారి రక్తబంధువుఁడనగు నేనందులకు దొరకొనుట పాడిగాదని వదలితి. పాండిత్యప్రకర్షనాదులలో నొక యడుగు నాకన్న మించిపోవుచున్నను ఆదిప్రోత్సాహకుఁడననియు, వీరిని శిశుదశనాఁటఁగోలెఁ బ్రేమావాత్సల్యములతోఁ జూచుకొన్నవాఁడననియు, నాయౌత్సుక్యమును ప్రకటించుకొను కారణమొండు; ఆంధ్రకవితాసామ్రాజ్యమేలి యాంధ్రులకు శాశ్వతదానమొసంగిన మహానుభావుఁడగు శ్రీ శ్రీ శ్రీ బమ్మెర పోతనామాత్యునిపైఁగల గాఢంపుభక్తిని, వినమ్రతను, జాటుకొనవలెననెడి కౌతూహలము రెండు; ఈరెంటి నాధారపరచుకొని యీబాలకు లప్పుడప్పు డచ్చటచ్చటఁ గల వార్తాపత్రికల కనిపిన యీపద్యము లొక్క చిన్నపొత్తముగ సాంధ్రుల హస్తములయందుంచు కోరికచే నీతొలియత్నమునకు "గురుదక్షిణ" యను నామకరణమొనర్చిరి. ఈనామ మెంతవఱకు యోగ్యమో నేను నిర్ణయింపఁ జాలను. రస, భావ, ధ్వనులకు ప్రాధాన్యమిచ్చి యాధునిక పద్ధతులపై నాధారపడుచు నడకలో స్వతంత్రించుచున్నను బురాతనాంధ్రకవిసార్వభౌమునిపై భక్తివినయములఁ జూపుటలో వీరి నెంతయుఁ గొనియాడఁదగుననియే నాసిద్ధాంతము. అనందపరవశత్వమును గొల్పు ధ్వని; జాలుచున్న కొలఁదియు రుచి నినుమడింపఁజేయు రసామృతము; వీటినే లక్ష్యమునందుంచుకొని భాషావధూటిని సేవించు వారలందఱకు నేను కృతజ్ఞుఁడనే. ఇఁక గ్రంథమునుగూర్చి నేనెక్కుడుగ విన్నవించుకొనను. కాని యిట్టి యుద్గ్రంథమును నాగ్రంథమాలకొసంగి నన్ను ధన్యునిఁగావించినందుల కీబాలకుల నెంతయు నభినందించెదను.

## ఇంక గ్రంథమాలనుగూర్చి రెండేముక్కలు.

మదీయ విశ్వచిత్ర సురానంద ప్రచురణానంతరము కలిగిన యవాంతరములఁగూర్చి విశదీకరింపవలయునన్న రమారమి 500 పుటలుగల గ్రంథము కాఁగలదు, కాన నీజాప్యమునకుఁ గారణములుగా నీనడుమ వచ్చిన 1 తుఫాను దెబ్బ, 2 చందాలయొక్క వేతలు 3 గ్రంథమాల పునరుద్ధారణయత్నములు యీ మూటిపైఁ ద్రోసివేతును. రాఁగలగ్రంథమునుండియు సకాలమునకు వెలువడు మార్గములు కలుగఁజేసితిని. చందాదారులసంఖ్య బహుస్వల్పముగుటచేతను, ఒకపైసయేని మూలధనము లేకుండ యాంధ్రులమీదనే యాధారపడి యీ సత్కార్యాచరణోద్యోగమునకుఁ బూనుకొనుటచేతను, యీ గ్రంథమాలకు సర్వకార్యనిర్వాహకత్వమునకు నే నొక్కఁడనే సేవకుఁడనగుటచేతను, దీనిని పరియగు స్థితిలోనికిఁ దెచ్చివదలిన బాగుండునను సంకల్పముచేతఁ దత్ప్రయత్నములయందుంట గ్రంథప్రచురణమున కాలవ్యయమైనదని విన్నవించి వదలెద. గ్రంథమాల పునరుద్ధారణకొఱకు నన్నుఁ బురిఁగొల్పినది నిజాంరాష్ట్రము, దీనికొంతకాలము నిలచుమార్గముఁ జూచినది నిజాంరాష్ట్రము. నైజాముగ్రామమున నిప్పటికి 300 మంది చందాదారుల సేకరించుకొనఁగల్గితిని. ఇదియొక విశేషముకాదు. ప్రభువులు తమపరిపాలనావిధానములలో స్వభాషాపోషణముకూడ గలదని తలంచినచో; ఆంధ్రులు తమ యాంధ్రభారతిని ప్రోత్సాహక మూలమున సేవింపఁగల్గినచో; చందాదారులు దరఖాస్తులొసఁగినది మొగమోటముకొఱకుగాదు హృదయపూర్వకముగనే యని యంగీకరించి వీ.పీ. లు త్రిప్పివేయని సహాయమొసర్చినచో నిట్టిగ్రంథమాలలు శాశ్వతముగా నిలువఁబడి భారతీపతిని సేవింపఁగలవు. ఈ కొఱఁతలేర్పడుటవల్లనే యెన్నియో గ్రంథమాలలు స్థాపింపఁబడి యంతరించిపోయినవి. భావిదశయందు నా యుద్యమపుస్థితి యెట్లుండునో? భార మాంధ్రులది. ఆపైని దైవముది. నిజాంరాష్ట్రములోని మనయాంధ్రులొసర్చిన సహాయమునకుఁ గిమ్మతునిర్ధరింపఁజాలను. వారినామము లొక్కొక్కతూరి స్మరించిన జాలదనియు; ఒక్కొక్కతూరి స్మరించుటకే యిరువదిపుటలు కావలయుననియు; మొత్తముగా నిజాంరాష్ట్రాంధ్రులని తెలిపివదలితి. కావున సహాయమొసంగి నన్నింతవఱకుఁ దెచ్చిన మన్మిత్రులు తమ [illegible]రింపుఁగానరా

లేదనియు, వారియెడలఁ గృతఘ్నుఁడ నైతిననియు నెంతమాత్రముఁ దలఁపని యభయహస్తము నాకొసంగిన ధన్యుఁడ నయ్యెదను.

ఇఁక గ్రంథములఁగూర్చి:— ఒక్కొక్క రిమ్మంబున కొక్కొక్కటి రుచించును. కొందఱు నాటకములో యందురు. కొందఱు నవలలో యందురు. ఆధునికకవిత్వమును జదివి జూడ వాంఛింతురు కొందఱు. ఎవరిశక్తి నిద్దొక్కిన నీయాంధ్రలోకమునఁ దను రంజింపఁజేయఁగల్గుదునో తెలుపుమని యాపర బ్రహ్మస్వరూపమును బ్రార్థించుచున్నాఁడను. కాని ప్రస్తుతము మాత్రము సాలునకుఁ బ్రచురించు నాలుగుగ్రంథములలో 1 నాటకము 2 నవల 3 ఆధునిక పద్ధతులమీఁది పద్యకావ్యము 4 మహాత్ములచరిత్ర, యీవిధముగ ముద్రించునట్లు లేర్పరచితిని. కాన గ్రంథము పెద్దవా? లేక చిన్నదా యను విమర్శనము నదలి గ్రంథములయందుఁగల విషయచర్చలయందుఁ దమబుద్ధి నుపయోగపరచుచు నా గ్రంథముల కన్నివిధములగు ప్రోత్సాహములను గలుగజేసి శాశ్వతముగ నిలుపుభార మాంధ్రమహాజనులు వహింతురుగాక యని ప్రార్థించుచు నీగ్రంథ మత్యంతస్వల్పకాలమున వెలువడుటయందు నాకు గుడిభుజమైన చిరంజీవులగు మా జేటి వెంకటేశ్వరరావు నామమిచట నొకసారి స్మరించి యతని యాయురారోగ్యైశ్వర్యాభివృద్ధికిఁదగు యాశీస్సులొసఁగి యింతటితో విరమించుచున్నాఁడను.

ఇట్లు,

25—9—25,
మకాం, బెజవాడ.

కో. సత్యనారాయణరావు.
కార్యనిర్వాహకుఁడు.

# మా మనవి

## వందనసమర్పణము

అప్పుడప్పుడు ఏదోకొంత ఉల్లాసముగా నున్నపుడు ఆలపించిన యీ చిన్ని గీతికలను పుస్తకరూపమున ప్రకటింపగల్గుదుమన్న ఆశ మొదట లేదు. రసగ్రహణపారీణత యుండియో లేకయో యెట్లయినను పత్రికాధిపతులు అభినవకవితను ప్రోత్సహించుచుండుట సర్వవిదితము. ఆరీతిగనే ప్రోత్సాహమందిన వారిలో మేముకూడ నున్నారము. ఇందులకు పత్రికాధిపులకు ముఖ్యముగా కృష్ణా- ఆంధ్ర- భారతీ పత్రికాసంపాదకులకు కృతజ్ఞతావందనముల సమర్పించుట మావిధియనుకొనుచున్నాము. కవిత్వమందలి మాయభిరుచికి తొలికారణమై, మా గీతికలకు పుస్తకరూపమాపాదించిన శ్రీ హనుమంత విలాసాధిపులకు, బహు నాటకగ్రంథకర్తలకు, సుప్రసిద్ధనటులకు శ్రీయుత కొడాలి సత్యనారాయణరావుగారికి మా మనఃపూర్వక వందనముల సర్వదా యర్పించుచునే యుందుము. మా గీతికల నింతశ్రద్ధతో వినుచు, ప్రచురణ ముత్సహించుచు, ప్రచారమునకు తెచ్చుచు, విమర్శించుచు వేయివిధముల తోడ్పడుచుండిన మిత్రబృందమునకు శాశ్వత స్మరణచిహ్నముగ వందనబంధ మేర్పరచుకొనుచున్నాము. బాలకులమయ్యును గురుశుశ్రూషాలబ్ధ కవిత్వభాగధేయము మాకు లభింపకున్నను ఆధునిక కవితావధూటికనుసరణపాత్రులై, సనాతనకవితకు చివరవారలై పూర్వాధునిక యుగముల సమ్మేళన మొనర్చిన శ్రీ తిరుపతి వేంకటేశ్వరులకు మా యేకలవ్యశిష్యత్వమును ప్రకటించుకొనుచున్నాము. వారికడ చదువలేదు. కాని వారిముఖమున వారి కవిత్వమును వినినప్పుడు, వారి ముఖపద్మముల నీక్షించినపుడు కలిగిన భావోద్రేకమే, రసామృతాస్వాదనమే మా కవితావాహినికి జన్మస్థానమైనది. ఇదియే వారి గురుత్వమునకును, మా శిష్యత్వమునకును గల సంబంధబాంధవ్యము.

## కవిత్వము

మహాకవులు నిర్వచించి యేకీభవించని కవిత్వమును, లాక్షణికులు నిగ్రహించి నిర్ణయింపజాలని కవిత్వమును అల్పజ్ఞులగు మాదృశులు ఇట్టిదని వచించి వర్ణిం

చూట హాస్యాస్పదమేయగును గాని లక్ష్యము లేనిపని లేదను స్వాభావిక సిద్ధాంతమును బట్టి ఆనందమే పరమావధిగా గల్గియున్నది కవిత్వమని చెప్పుటకు గొంకకున్నాము. ఒక అక్షరము మృదువుగ పలికినచో, ఒక శబ్దము మంజులముగ నుచ్చరించినచో - ఒక స్వరము రమణీయముగ ఆలపించినచో - ఆనందము జనింపక పోదు. అట్టి అక్షరములు - శబ్దములు - స్వరములు - ధ్వనులు అన్నియు నానందకందములే. కోకిల "కూవు" లోని యవ్యక్తమాధుర్యము ఆనందదాయకమగును గాని అనిర్వచనీయము గూడను. కవియును ఒక విహంగమునంటివాడు. భావోద్రేకము కలిగినప్పుడు, రసనిష్యందనము జరుగుచున్నప్పుడు కవినోటనుండి బయల్వెడలిన కూజితములే గీతములై, గేయములై, పదములై, పద్యములై విలసిల్లుచుండును. భావముచే - రసముచే - ధ్వనిచే ఆనందము కలుగుచున్నది. కావున యానందమునందే కవిత్వమిమిడియున్నది.

## కవిత్వమునకు కట్టుబాటు లనవసరములు.

ఆనందాంతమగు కవిత్వము నిట్లుండవలెనని శాసించు అధికారమెవ్వరికిని లేదు. ఆనందమున కంతులేదు. పరిమితిలేదు. తత్సంబంధియగు కవిత్వమునకు కట్టుబాటులు లేవు. లేని యధికారముల తెచ్చిపెట్టుకొనుటయే లక్షణములయుత్పత్తికి కారణము. అయినను, కాకపోయినను అది మాయూహ. సరసముగ ధ్వనించుటకు, మృదువుగా రచన వినబడుటకు తెచ్చిపెట్టుకొనిన యతిప్రాసలు కవిత్వమునకు శృంఖలములైనవి. "నగయాని నాను పెట్టుకోబోతే ఉరితాడైందట." ఇట్లనువారు పండితపుత్రులని తలచువారు కొందరుందురు. ఉన్నను మహాబాగే. మాయూహ నిర్భయముగ వెల్లడించితిమి. అక్షర మెత్తినచో నదియే యొక గణము. అట్టిచో వేరు గణము లేలకో? అట్టి యనవసరగణబద్ధులమైయుండి దాస్యమొనర్చుట మాకిష్టము లేదు. లక్షణములను — గణములను తనకు తగినవాటిని కవియే యేర్పరచుకొనును. ఒకకవి గణగుణము లింకొకకవికి యుండనవుసరము లేదు. ఎవరి రసోద్రేకఫలితలక్షణ గణగుణములు వారివి. లక్షణగణములు కవి యూహాపోహలకు, కవిశాసనమునకు లొంగియుండవలయును గాని కవియే వానికి లొంగియుండుట కవియొక్క నిరంకుశత్వమునకు (నిరంకుశాః కవయః అను

ప్రమాణము(ప్రకారము) సత్కవి ప్రకృతికి,—కవితాస్వేచ్ఛాస్వభావమునకు భంగదాయకమని మాసందేహము. ఇది చర్చకు వెల్లడించినసంగతికాదు. పాఠకమహాశయులకు మాకవిత్వ మెఱుకపఱుపగోరి చేయుచునవి.

పోతనామాత్యుని కర్పించిన "గురుదక్షిణ"యందు రెండవపద్యము లోని 4 వ పాదములో

"...  ...  ...  ...  ఖం
గారుణ బొందగజేసి తాత్మబలది ♦ వ్యజ్యానినాదంబునన్."

లక్షణప్రకారము యతి పోయినదట- ఇదియొక స్నేహితుని పలుకు. "లక్షణము తప్పిననుసరే ఆ పాదము మార్చుటకు వీలులేదు. 'భావరసధ్వనులుమార్పుచే నాశనములగు వికృతముగా—శవాకారముగా—లక్షముతోనున్న నేమి? అందముగా—బలముగా—లక్షణాధికముగానున్న నేమి" యని యింకొకహితునిసమర్ధన—సద్విమర్శనమన్న యిదియే యని మాయభిప్రాయము.

## విమర్శనము

విదేశములందలి భాషలవలె తెల్గుబాస విజృంభించకుండుటకు కారణము విమర్శకులు లేకుండుట. విమర్శకులు లేక కవితవిశ్రుతము కాజాలదు. "It is the critics that make the poet" కవిని పైకిలాగువాడు విమర్శకుడు. అడగద్రొక్కువాడు విమర్శకుడు. విమర్శకుడన్న సద్విమర్శకుడన్నమాట. ఇట్టి విమర్శకులాంధ్రభాషా ప్రపంచమున ప్రబంధకవుల యువతుల నడుములవలె సన్నమైయున్నారు—కాని యెవరో— యేదియో యొకపుస్తకమును వ్రాయుట— పేరుపడినవాని నెవ్వరినో దానికి తొలిపలుకు వ్రాయమనుట—వారేవో రెండు మొగమోటపు ముక్కలు వ్రాయుట ఆచారమైయున్నది. గ్రుడ్డిలో మెల్ల. ఇదివరకు కవిత్వము చదివి యూరకొనెడివారు ఇప్పుడో స్తుతిచేయుచున్నారు. గుణాగుణవిమర్శనకాల మికముందు రాకపోదు గాని భాషావిజృంభణమమాత్ర మాలస్యమైపోయినది. గతంనాస్తి. ముందైనను "విమర్శకులారా! బయల్పడుడు. మోమోటమిని వదులుడు. మాపై

దాడివెడలుడు. జయమో, అపజయమో మానెత్తిపై త్రోయుడు" అని యొకకవి యొసగిన యాహ్వానమునకు విమర్శకు లంగీకారము చూపవలసి యున్నది.

ఇంకొకమాట.

"మాథ్యూఆర్నాల్డు" కవిశేఖరునివలె స్వకవిత్వవిమర్శనముగూడ మంచిదే యగును. కాని విమర్శనమే లేనికాలమున స్వవిమర్శనము మధ్యమెట్టు వదలి పైమెట్టుపై కాలుపెట్టినట్లుండును. ఇకముందు భగవంతుడు దనుగ్రహించి గ్రంథరచనకు ఓపిక, ఉత్సాహముల నొసగినచో మాకవిత్వము నందలి తప్పొప్పులను మేమే మాకందినంతవఱకు బయటకు గుంజుకొని రాగలము. ఇది తొలిగ్రంథమగుటచే వెనుకాడితిమి. ఇంతవరకు లఘువుగ కవిత్వము, లక్షణములు, విమర్శనలను గూర్చి మాయభిప్రాయముల విశదీకరించితిమి. కావున మామనవి చదివినపిదప మాకవిత్వమును చదువుట పాఠకులకు ధర్మము. శ్రమకు క్షమాపణలు.

ముగింపు.

ఏమహనీయకవిసార్వభౌముడు కవితాగగనమున లాక్షణిక రాహుకేతువుల కందని భాస్కరుడై ఆంధ్రకవితాస నక్షత్రములమధ్య చంద్రుడై ప్రకాశించుచున్నాడో ఆ యశోమూర్తికి, ఆకవితాపరస్వరూపమునకు, శ్రీ బమ్మెర పోతనామాత్యున కీతొలిగ్రంథము నంకితమొనర్చుకొను భాగ్యమును కలిగించినందులకు రామభద్రున కనేకవందనములు.

గ్రంథగుణాగుణ పరీక్షణము, తత్ఫలితమగు ప్రోత్సాహము పాఠకుల భారమై యున్నందున మాభవిష్యద్భాషాదాస్యము వారిపై నాధారపడి యున్నదని వేరుగ వ్రాయుచ్చు టనవసరము. సెలవు —

ఇట్లు

భాషాసేవకులు,

గ్రంథకర్తలు.

# విషయసూచిక

# కృతి సమర్పణము

ఆంధ్రకవితా సామ్రాజ్య పట్టభద్రుడగు

## శ్రీ బమ్మెర పోతనామాత్యునకు

ఈ "గురుదక్షిణ"

భక్తి వినయ ప్రేమల పురస్సరించుకొని

సమర్పించుకొనుచున్నాము.

కొడాలి వేంకటసుబ్బారావు

కామరాజుగడ్డ శివయోగానందరావు






శ్రీరస్తు.




ప్పించి యెగసిన ♦ కుండలంబుల కాంతి”
చిత్రించుమా ఆంధ్ర ♦ శిల్పివీవు
“హాసలీలానిద్ర” ♦ లం దూహాలను పెంచు
విజ్ఞానరాజ్య క ♦ వీంద్రుడీవు
“లలితరసాల ప ♦ ల్లవఖాది”కోయిల
నడకించు ఆంధ్రగా ♦ యకుడవీవు
“పొడిచిన కొట్టిన ♦ పడుట” నటించిన
నవభావకలితాంధ్ర ♦ నటుడవీవు

ప్రకృతి సౌందర్య శోభాస్వ ♦ భావగరిమ
కొల్లగా బోధజేసిన ♦ గురుడవీవు
భాగవత మానసాంతర్వి ♦ రాగదృష్టి
తన్మయత్వంబు గన్నవే ♦. దాంతివీవు||

దారిద్ర్యాంబుధి నీదినాదవు స్వతం ♦
త్రప్రాజ్ఞ భోవీధి నెం
త్రో రాజిల్లితి రాజురీతి గుణ వి ♦
ద్యచ్ఛక్తిలేశ ప్రభన్
తారాజున్ హారిబంటు జేసితి యశో ♦
భ్రాజిష్ణు శ్రీనాథు "ఖం
గాయిన్" పొందగజేసి తాత్మబలది ♦
వ్యజ్యానినాదంబునఁ ॥

శారదావల్లకీస్వర ♦ శాంతిగీతి
నాలకించి మహాజ్ఞాన ♦ మందినావు
జ్ఞానకాంతి ప్రసార వి ♦ స్తారమునను
చీల్చితివి శారదను ముంచు ♦ చీకటులను॥

పసిడిరేకుల తళుకుల ♦ ప్రతిఫలించు
బాలభానుని కిరణాల ♦ ప్రజ్వలించు
పట్టుపీతాంబరంబుల ♦ పరుగులిడును
పుట్టతేనియసోనల ♦ పొరలుచుండు
నీదుచూపులు, తలపులు ♦ నీ వలపులు
నీదుపల్కులు ఆంధ్రావ ♦ నీకవీంద్ర॥

మేఘోదయంబున ♦ మిసమిసపురివిచ్చి
నృత్యంబొనర్చెడి ♦ నెమ్మివోలె
పౌర్ణిమచంద్రికల్ ♦ ప్రసరించగనె నింగి
కరుగ పైకెగురు సా ♦ గరమువోలె

సూర్యోదయంబున • సొగసుగా రేకుల
సడలించుకొను జల • జంబువోలె
చిరకాలవిరహాసం • శ్లేషణసుఖముచే
పొంగిపోయెడి లలి • తాంగివోలె

భవదమృతనామ కీర్తనో • త్సవమునందు
పరవశత్వంబుజెంది భా • వములడింది
మించి ఆత్మార్పణంబు గా • వించికొందు
పుట్టుకవిరాజ! బమ్మెర • పోతరాజ!!



శ్రీ



లఁ బెంచి సమున్నతంబగు యశ ♦
శ్రీ ఖండఖండంబులఁ
వాలాయంబుగనించి ఆంధ్రజాలకుఁ ♦
స్వాభావికంబైన స్వే
చ్ఛాలావణ్యము విస్తరించి జయదీ ♦
క్షుఁ బ్రౌఢిగావించి ఆ
శాలోభత్వములఁ హరించి జగదీ ♦
శా! కావుమా ఆంధ్రులఁ॥

హరిహరాదులకైన ♦ అంతరాయము లొడ్డ
సమమలశాస్త్రవి ♦ జ్ఞానలక్ష్మి
“కత్తిపోటుకు తిర్గ ♦ గానము మే” మని
శత్రులే పొగడిన ♦ శౌర్యలక్ష్మి
ఖండాంతరములందు ♦ నిండిపర్ఘిల్లి ప్రి
పూజ్యమైనట్టి వా ♦ ణిజ్యలక్ష్మి
నిండుపంటలతోడ ♦ నుండి సమృద్ధిగా
భోగ్యమైనట్టి సౌ ♦ భాగ్యలక్ష్మి
మహితగుణలక్ష్మి నిశ్చల ♦ మంత్రిలక్ష్మి
తోడరా ప్రకృతినిగూడి ♦ వేడుకలర
పాడుచును వేడుచును మేల ♦ మాడికొనుచు
ఆడుచును ప్రొద్దుబుచ్చు శ్రీ ♦ ఆంధ్రలక్ష్మి
ప్రోచుగావుత సుతుల సం ♦ పూర్ణకృపను॥



# ఆంధ్రతేజము

ఊగులాడితివంట ♦ ఉవ్వెత్తుగా నీవు
తుంగభద్రానది ♦ భంగములను
చెలువమొప్పారగా ♦ స్వేచ్ఛావిహారంబు
సలిపినావంట కృ ♦ ష్ణాస్రవంతి
పాటపాడితివంట ♦ భవ్యగోదావరీ
సైకతస్థలముల ♦ శ్రావ్యగతిని
ఐరావతీనదీ ♦ యమలతోయంబుల
నప్పుడప్పుడు తాన ♦ మాడితంట

ఎన్ని యోయేండ్లు గడచె హా! ♦ యెవ్వడెరుగు
ఏది తొల్లింటి నీరూపు? ♦ నెరుకపరుప
మరల నొకసారి వెన్కకు ♦ మరలి నీ ని
జప్రభలునింపు మాంధ్రతే ♦ జంబనీవు॥

కాలపరివర్తనంబున ♦ కలిసి మరుగు
పడితివి మరల కాలగ ♦ ర్భంబునందె
ఉద్భవించవ? ఆంధ్రసే ♦ తోత్సవంబు
సల్పకుండువ? ఆంధ్రతే ♦ జంబ నీవు॥

కలయొ నిజంబొ నాకెరుక ♦
గాదు ప్రపంచమునందు తొల్లి య
త్యలఘుతరప్రతాపమహి ♦
మాతిశయంబులు నింపితంచునన్

పలువురుచెప్పగా వినెడి ♦
భాగ్యముకల్గెను కన్నులార నీ
చెలువముగాంచి సంతసము ♦
జెందుట యెన్నడో? ఆంధ్రతేజమా॥





# మా కవిత

సాంద్రచంద్రికా శీతల•చ్ఛాయలందు
శరదభంగతరంగ సం•చారమందు
క్షణిక సౌదామినీ వికా•సములయందు
ఆంధ్రకవితా స్వభావము• లమరియుండు||

ప్రకృతి బాహ్యాంతరస్వరూ•పములయందు
వెరపెరుంగని చురకత్తి• నరుకులందు
భక్తవర్యుని ధ్యానసం•పత్తియందు
రాజ్యతంత్రజ్ఞయుక్తి పరత్వ•మందు
తెలుగు కవనలక్షణములు• తేటపడును||

భాస్కరకరప్రచార సం•పర్క హీను
లాంధ్ర కవితామహాకాంతు•లరసి బ్రతుకు
దివ్యగీర్వాణ భాషాస•తీలలామ
ఆంధ్ర కవితా విలాసము•లరసి మురియు||

# మా మాత



భక్తిపరిభావనం ♦ భవమైననారద
  పరమయోగీంద్రులౌం ♦ బురరవంబు
కరపల్లవములూగ ♦ కదలి మ్రోగినయట్టి
  శారదాదేవి వీ ♦ ణారవంబు
అస్తాగమనకాల ♦ మందు హర్షముజూపు
  రమణీయమగు కోకి ♦ లారవంబు
మకరంద రసపాన ♦ మత్తమాధుర్య స
  మ్మిళితమై చెలగు తు ♦ మ్మెదరవంబు
ఏకమై తోచునేమొ త♦ల్లి! త్వదీయ
దివ్యవాక్కులు వినుపింప ♦ తియ్యదనము
ప్రేమ, మృదులత, భక్తిప్ర ♦ వించునేమొ
శ్యామలాదేవి! నిన్ను జూచు ♦ సమయమందు॥

అంబుధిని జేరి యలలక ♦ రంబులెత్తి
కూర్మియాశీస్సులను వేలు ♦ కురియుచుండు
వనిల సౌరభ్యశైత్యమాం♦ద్యముల జేరి
కౌగిలించి బిడ్డల ప్రీతి ♦ గనుచునుండు॥

మరతునటన్న నిన్ను తర ♦
  మా కనుమూసిన యంతలోనె సుం
దరభవదీయవిగ్రహమె ♦
  దర్శనమిచ్చి దయావలోకన

స్ఫురణము నించు, సోదరుల ♦
జూపుచు హస్తముజాచుచుంట దు
ష్కరమయి దీర్ఘ యోచనల ♦
పాఱానరించి కలంచుచుండెడిన్॥

కనులను విప్పినంత తప ♦
కాండములంపెలి పత్రిమర్మర
ధ్వనులను జేరి ధైర్యము సు ♦
తాయని హెచ్చరికంబు సేతు త
త్క్షణము నె మేఘఖండముల ♦
ఛాయల జేరుచు భానుతాపమా
ప నడుగు వెట్టుదు కృ ♦
పాకలనంబున మాతృదేవతా॥

లేనటులుండి యెల్లెడల ♦
లీనముజెందెను నీదురూపు త
ల్లీ! నవరాజ్య కస్తురి వి ♦
లేపనమున్ ప్రచరింపగోరు నీ
యానతి మాళి దాల్తుము వి ♦
హార సుషుప్తుల యందుగూడ నీ
ధ్యానము మాన నోపము స ♦
దా మము కావుము మాతృదేవతా॥





# శరద్రాత్రి

పండువెన్నెల లెల్లెడ ♦ నిండుకొనియె
కంటి కింపుగ నుండె న ♦ క్షత్రపం క్తి
అద్దమున నున్న నిర్మలం ♦ బైన గగన
జలధి దోగుచునున్న ని ♦ శాచరుండు
రమ్యముగ నుండె శారద ♦ రాత్రి వేళ
ప్రకృతియంతయు శాంతభా ♦ వమును దాల్చె.

కోమలము లైన సుమలతా ♦ కుంజములను
పచ్చనా చెట్లయాకుల ♦ జొచ్చి లోని
పాన్పుపైబడి కిటికీచు ♦ వ్వలను దాటి
పొడలు పొడలుగ చంద్రికల్ ♦ పొల్పుమీర
హృదయమున కెంతయో ముద ♦ మొదవజేసె.

ప్రియుని యెడబాసి యొంటి జీ ♦ వించుచుండి
కాలమునుబుచ్చు విరహిణి ♦ కలముబూని
ప్రేమలేఖను లిఖియింప ♦ గా మొదలిడి
దీర్ఘ యోచనలో మున్గి ♦ తేలుచుండి
తన్మయత్వంబు జెందెను ♦ తనువుమరచి
ప్రకృతిశాంతంబులోన వి ♦ శ్రాంతిగాంచె.

నిర్మలంబుగనున్న కో ♦ నేటినీట
కళలునిండినచంద్రుడు ♦ కాంతిగులుక

చూచుచుండెను నెమ్మోము ♦ సోయగంబు
కాంతుచే తేర నూత్నవి ♦ కాసమొంది
కలువపూవులు వికసించె ♦ గంధవహుడు
సారతరులతాఘటపుష్ప ♦ సౌరభమును
పరగ తాలిచి నీటను ♦ స్నానమాడి
కదలలేకుండుటను మంద ♦ గతి జరించె.

గాలితాకున లేచి సు♦న్నాలవోలె
తెరలు తెరలుగ మెల్లన ♦ తీరమునకు
తరలుచుండెడి యలలమె ♦ త్రాంబునందు
యామినీ కాంతుడలరి యు ♦ య్యాలలూగ.

అక్కడక్కడ లేచి త ♦ ళుక్కుమనుచు
వెండిముక్కలవోలె క♦న్పించుచుండి
నీటముంగెడి చేపల ♦ నిస్వనంబు
శ్రోత్రపుటములకు విన ♦ సొంపుగలిగి
శాంతిభంగంబు గావించె♦జలమునందు.

మెత్తనౌ పట్టుకుచ్చును ♦ మించియుండి
చిత్రమౌపూలతోడ కా ♦ శ్మీరదేశ
రత్నకంబళులోయన ♦ రహిఁదనర్చు
పచ్చికబయళ్ళనందున ♦ పరుగువారు
విమల జలపూరితప్రవా♦హములచెంత
సృష్టివైచిత్ర్యమెల్ల నూ♦హించుచుండి
తనివిగాంచుచునున్న స♦త్కవివరేణ్యు
భావశక్తి పవిత్రరూ♦పంబుదాల్చె.

కరయుగంబున గ్రహియించి ♦ గాయకుండు
వీణమీటిన మాధుర్య ♦ గానలహరి
వెల్లివిరిసెను వీనుల ♦ విందుగొలిపె
స్ఫుటతరంబయ్యె భువన సం♦మోహనముగ.

దైవనిర్మాణచాతురిన్ ♦ దలచితలచి
"భూరితేజోవిలాసన ♦ మో"యటంచు
నయన యుగ్మమ్ము మోడ్చి ధ్యా♦నమ్మునందు
భక్తవర్యుడు పరవశ♦త్వంబుగాంచె.

చంటిబిడ్డను నోదార్చి ♦ చంకదాల్చి
తల్లియన్నము పెట్ట జా♦బిల్లిజూప
చిన్ని చేతులు పైకెత్తి ♦ చిరుతనగవు
చిందులాడంగ నానన ♦ సీమయందు
చందమామ రా వేయని ♦ డెందమలర
చిలుకపలుకుల పాపడు ♦ పిలువజొచ్చె.

అమిత బలశాలియైన భీ♦మన్నగూర్చి
దేశసేవాపరుండు సు♦ధీవరుండు
బహుళసద్గుణరాజి శి♦వాజిగూర్చి
విసుగులేక మాముసలవ్వ ♦ వింతకథలు
చెప్పుచుండెను తా తులి ♦ సెమ్మదద్ద
కుర్రవాళ్ళట జేరి "ఊ" ♦ కొట్టుచుండ
నిదురవచ్చెను మేమును ♦ నేత్రయుగళి
తెరచులోపలనే తూర్పు ♦ తెల్లవారె.



# ఓదార్పు



ప్రణయకాలంపు హర్షబా ♦ ష్పములయందు
స్నాతలై స్వాగతంబిడ ♦ సమయమరయు
నీదుక్రీగంటిచూపులు ♦ నేఁడిదేమి
చురుకుదప్పెను మాంద్యంబు ♦ చూపుచుండె

సతము బిగియార కౌగిలి ♦ శ్రమను బాప
యెదురు చూచుచు నుండెడి ♦ యీమృదుతర
బాహువల్లికల బిగింపు ♦ పట్టు వదలి
సడలి పోవుచు నుండెను ♦ సఖి యిదేమి.

కాలవశమున నొకచోట ♦ కలిసి కొంటి
మరుగు చుంటిమి మనబుణ ♦ వ్యథలుతీఁగ
సౌఖ్యమున నోలలాడంగ ♦ జాలినపుడు
కష్టసంతతి భరియింప ♦ కర్తలెవరు?



# సన్యాసి—సంసారి



ఆశలను తెగించి లోకంబు ♦ నధిగమించి
యజనముల దాల్చునట్టి స ♦ న్యాసివీవు
రకరకంబుల నూత్న వ ♦ స్త్రముల దాల్చి
స్వాభిమానంబు విడని సం ♦ సారినేను.

కందమూల పర్ణఫలాధి ♦ కముల నింద్రి
యముల నిగ్రహించిన యట్టి ♦ యతివినీవు
షడ్రసోపేతమైన భో ♦ జనము మరగి
తుచ్ఛసుఖముల గోరు మ ♦ త్తుడను నేను.

చారుసౌభాగ్య పర్ణకు ♦ టీరములను
అమిత సంతోషమందు స♦న్యాసి వీవు
రమ్యమణి నిర్మితాంతః పు ♦ రంబులున్న
శాంతిజెందని యట్టి సం ♦ సారినేను.

స్వప్రకాశమౌ ఆత్మ తే ♦ జంబుతోడ
పాపముదహింప జాలు పా ♦ వనుడవీవు
కటుభయంకర పాప పం ♦ కంబునందు
కూరుకొనిపోయి కృశియించు ♦ కూళనేను.

సదమల తపఃప్రభావ వి ♦ జ్ఞానమహిమ
వెలువరించుచుండెడి బ్రహ్మ ♦ వేత్తవీవు
తత్త్వబోధన జ్ఞాన బో ♦ ధనలనంది
ముక్తిగాంచు సామాన్యపు ♦ వ్యక్తినేను.

# నా చెంచు

## నామకరణపు వేళ.




యసీ—ఇకనిన్ను చెం ♦ చూయటంచు
పిలువ నూహించుచుంటిని ♦ పలుకవలయు"
ననిన—లోదోచు చిరునవ్వు ♦ నాపుకొనుచు
"చెంచుదానవా?—అమ్మతో ♦ చెప్పు"దనుచు
పరుగిడుచుబోయి—వెనుకకు ♦ తిరిగినాడు
కన్నులనుమూసి "కనుగొన్న ♦ కాన్కలిత్తు"
ననిన—తోడనె—"నాచెంచు" ♦ యనివచింప
మోము మోమున జేర్చి నే ♦ ముద్దులాడి
ప్రేమవారాశిముంచి సం ♦ ప్రీతినించి
చిత్తమలరించి వెతనొంచు ♦ చిన్ని చెంచు
మరతువా? నన్ను నీదునె ♦ మ్మనమునందు.

## బాల్యక్రీడలు

కష్టసౌఖ్యంబులన నేమొ ♦ కనగలేని
బాల్యమందున — హర్ష ప్ర ♦ భా విచలిత
మూఢహృదయాల—దాగుడు ♦ మూతలాడు
నపుడు —నే దొంగనైతిన ♦ టన్న రోష
మావహింప—నీతో మాట ♦ లాడనపుడు
"కోపమా కోపమా"యని ♦ కూర్మిమీర
పంచమ పికస్వరంబున ♦ పలుకరించి
డెందమలరించి లాలించి ♦ మందలించి

పరిహాసించిన నాటి స ♦ త్ప్రణయవల్లి
శాంత గంభీరరసముల ♦ సంక్రమించి
ప్రాకి, యభివృద్ధిజెంది, పు ♦ ష్పములపూచి
కాయలను గాచి ఫలియించు ♦ గాదెచెంచు.

సుందరాభ్రతలంబందు ♦ చందమామ
జలధర ప్రకరఖండ సం ♦ చారమునను
కనుపడుచు, మాటు పడుగుచు ♦ కదలినట్లు
నడచుచున్నట్లు తోచుచు ♦ న్నపుడు — నేను —
పరుగిడుచు "చందమామనా ♦ పట్టుగాన
నన్ను వెన్నాడివచ్చుచు ♦ న్నాడ"టంచు
పలుక — నీవును పక్వోక్తి ♦ "భాస్వరుండు
నాదెస కేవచ్చు" నంచును ♦ వాదులాడ
"కదలునవి మేఘములుగాని ♦ కాదు చంద్రు"
డంచు యటనున్న పెద్ద వ ♦ చించునంత
"నిజము నిజ"మని సంధికై ♦ ధ్వజము లెత్తు
మూఢభావాల తలతువా? ♦ ముద్దుచెంచు||

## తో ట ల్లో

నిర్మలోద్యాన వీధుల ♦ నిన్ను గూడి
సంచరించుచునున్నప్డు ♦ సరసనిలిచి
సుమనికుంజంబులందు దృ ♦ ష్టులనిగిడ్చి
"కోసియీగలవా" యని ♦ కోరినట్లు
నన్ను తిలకించుచూపులం ♦ దున్న యాశ,
గాంచి నీయాజ్ఞ పాలించి ♦ గారవింప

ప్రేమతో బాహులతల నన్ను ♦ బిగియ గట్టు
టెన్నడైన తలంతువా? ♦ చిన్ని చెంచు.

ఆలమేపుచు నున్నట్టి ♦ వీలు నెంచి
జాడలరయ నేతెంచెడి ♦ సమయమందు
దూరమందున్న నారాక ♦ పారజూచి
చెట్లమొదలుల మరగున ♦ జేరి నిన్ను
తొంగి జూచుచునున్న నీ ♦ దొంగతనము
బయట పడినంత సిగ్గు, సం♦భ్రమము తోప
దూరమునకేగి నిలుచుండి ♦ తొలగితొలగి
ఓరచూపుల జూచుచు ♦ నొదగి యొదగి
చిరుత నగవులు మోముపై ♦ చెంగలింప
ఆశలను పెంచి, కరుణించి ♦ యాదరించి
కేలుసారించి, బిట్టుకౌ ♦ గిల్లొసంగి
చిత్తమును దోచుకొన్న నా ♦ చిన్ని చెంచు
తలతువా? ఎన్న డేని హృ ♦ త్కమలమందు.

## వీ ధి బ ల్లో

భారత మహాకథల నయ్య ♦ వారు తెలుప___
"పరుల గొల్చి, దుష్టులతోడ ♦ తిరుగుచుండి
దైవబోధనంబులనుంత ♦ దలపకుండ
తల్లి బ్రతిమాలినను గూడ ♦ తగవుమాలి
తమ్ము కుర్రలతో విరో ♦ ధంబుపూని
చెడియె 'కర్ణుండ'' టంచు నే♦ చెప్పినంత
"జనని దయవీడి యాపగా ♦ జలమునందు

విడువ సూతునిచే పంప ♦ బడియెగాన
పాండవులు భ్రాతలనియెడి ♦ భావమెటుల
గల్గు?—శౌర్యమందు రాజస ♦ త్కారమంత
గలిగి నప్పుడు పరులను ♦ గొలుచుటేమి?—
రాజబంధులు దుష్టులే?—♦ రాజుతోడి
సఖ్యతలభించునే?—యవ ♦ సానమందు
దైవహితమున, తల్లిప్రా ♦ ర్థనలవలన
మాట తప్పినచో కీర్తి ♦ మన్నుగాదె"
యనుచు నన్ను విమర్శించి ♦ నప్పుడు—గురుడు
అద్భుతం బందగా—"కర్ణు ♦ డనఘుడలఘు
డమితబలశాలి, దాత, స్నే ♦ హమున కతడె
పెట్టినదిపేర"టంచు నన్ ♦ గొట్టి నటుల
పంతమున బల్కు దినము స్మ ♦ రింతె? చెంచు.

## పొడుపు కథల వేళ

నీలమగు బల్లపై మల్లె ♦ పూలు గలవు
పూలమధ్యకు నొకచెండు ♦ పోవునంత
పూలువాడును—చెండు సం ♦ పూర్ణకాంతు
లెల్లడల జల్లు —పువ్వులు ♦ పల్లవించు
నంచు —పొడుపుకథలను పృ ♦ చ్ఛించి నన్ను
చెప్పుమా! చూతమనియన్న— ♦ చెప్పలేక
నీవెచెప్పుమనంగ నే— ♦ "నీలమైన
బల్ల గగనతలంబౌను ♦ మల్లెపూలు
తారకలు—చెండు చంద్రుడు— ♦ తత్ప్రభలను

పల్లవించు కల్వల"టంచు ♦ పలికి యెంతొ
కేలి యొనరించి, నవ్వుల ♦ మాలగుచ్చి
నన్ను తనియించు టెరుగవా? ♦ చిన్ని చెంచు.

## తొ లి క ల క

"వారమునకింకనే నిజని ♦
వాసము వీడితి తల్లిదండ్రు లె
వ్వార లెరుంగరీ కరణి ♦
వచ్చితి నంచును వారువిన్నచో
నేరమునాపయిన్ వెసకి ♦
నింద యొనర్చుచు నుందు గాన నీ
సారికిపోయి వత్తును ప ♦
శాంతమనంబున నుండు కోమలీ!!

"సెలవొసంగుమా" యనియన్న ♦ చిన్నవోయి
రెండు గుడ్లను నీరముల్ ♦ నిండు కొనగ
"మరల నెన్నడు వత్తువు ♦ మరువకుండు
డప్పుడప్పుడు జాబుల ♦ నంపు" డంచు
వీధి గుమ్మము వరకు నన్ ♦ వెడల నంపు
లలిత సౌభాగ్య లక్ష్మి వి ♦ లాసగరిమ
కన్నులకు గట్టినట్లు గా ♦ గానుపించి
చిత్తము కలంచి వెతనించు ♦ చిన్ని చెంచు.

## యుద్ధాని కెళ్ళ బోతే.

పారతంత్ర్యంబున ♦ బడియుండ లేము
జన్మస్వత్వంబుల ♦ సమయింప లేము
పౌరుషంబును వీడి ♦ బ్రతిమాల లేము
బ్రతిమాలిన ఫలంబు ♦ బడయంగ లేము
పగవారిమార్కొని ♦ పడ ద్రొబ్బివైచి
కత్తికోకండగా ♦ ఖండించివైచి
పచ్చినెత్తురుద్రావి ♦ పరవళ్లుద్రొక్క
జయ మందవలె లేద ♦ చావగావలెను
చచ్చినా స్వర్గంబు ♦ స్వాగతంబిచ్చు
జయమబ్బినా దేశ ♦ జనుల సంతోష
బాష్ప వార్నిధియందు ♦ బడి తేలవచ్చు
భూలోకస్వర్గంబు ♦ బొందగావచ్చు.

అనుచు హుటాహుటిన్ బవర ♦
మందున దూకగ సిద్ధమౌ ననున్
చనువున బిగ్గ బట్టుచు ని ♦
శాత దృగంచల వృష్టి నాపయిన్
జొనుపుచు శాంతి శాంతి యను ♦
చున్ వినుడీ ప్రియురాలి విన్నపం
బనుచు కృపాణ మందుకొని ♦
హస్తములం దిరికించు కొంచు 'ఛా'.

పగతురను చెండాడగా గల
మగటిమిం గల వాని కన్నను

తెగక తెంపక గెల్చువాడే
ధరుడౌ నార్యా.
పూవుతుంచుచు తావినానెడి
జీవుకన్నను మిన్నయౌగద
పూవునున్నట్లుంచి తావిని
పొందుమనుజుండే"

యనుచు నుత్తమ భావాల • మనసునింపి
పరమధర్మంబు బోధించి • ప్రాజ్ఞు జేసి
గురువువై శిష్యసేవల • కొసరుకొనుట
జ్ఞప్తియందున్నదో లేదో • గాదె చెంచు॥



# గ్రహియించితిని



ఔను నీమూర్తి నాకంటి • కగుపడు నెడ
పరవశుడనౌదునో — భక్తి • భార మాప
లేకక్రుంగుదునో — లేక • నాకరాబ్జ
ముల త్వదీయపదయుగళ • మునకు కాన్క
నిత్తునో — లేక బెదరెద • నేమొ — తండ్రి

పరుల మూర్ఛను జూచుటొ • ప్పదిగాక
పరులడగి క్రుంగిపోవుటిం • తరయ లేవు
పరుల సొత్తున కెపుడాశ • పడవుతండ్రి
యేనుశ్రమ జెందుదని యెంచి • యే త్వదీయ
రూపమును నాదు కనులకు • జూపవనుచు
యిపుడు గ్రహియించితిని రూప • హీనుడనుచు
ఘనులు నిను గూర్చి చేయు వా • దనలు వృథలు.



# నా వాంఛ




మిత పాపుడ నేను దు • రాగ్రహుండ
ఇంత సహనంబు తల్లి నీ • కెట్లు లబ్బె?
దేనికిఁ కొరగాను భూ • దేవి నన్ను
కరుణ గొనిపొమ్ము నీలోన • కలిపికొమ్ము.

స్వార్థపరుడను నేను ని • రర్థకుండ
ప్రజల సతతము నానంద • వార్థిముంచు
చారు సుకుమార కుసుమగు • చ్ఛంబులార
కరుణ గొనిపొండు మీలోన • కలిపికొండు.

కాని కార్యంబు లొనరించు • కలుషమతిని
మిమ్ము స్పృశియించినంత పా • పమ్ములడగి
ధన్యతను గాంతు పావనో • దకములార
కరుణ గొనిపొండు మీలోన • కలిపికొండు.

పరుల కేమాత్ర ముపయోగ • పడనివాడ
ధరణి సర్వంబు నొరులకై • ధారపోయు
సర్వజీవనాధార స • స్యంబులార
కరుణగొని పొండు మీలోన • కలిపికొండు.

భేద భావంబు నరసెడి • వెఱ్ఱి నేను
మహిని సతతంబు సర్వ స • మత్వమూని
మసలుచుండెడి వాడవు • మలయ పవన
కరుణ గొనిపొమ్ము నీలోన • కలిపి కొమ్ము॥



# ఆయువు

బాల భాస్కరు డుదయించు ♦ కాలమందు
శాంతలక్ష్మికి భంగంబు ♦ జరుగునపుడు
నిర్మలత నాకసం బెల్ల ♦ నిండు నపుడు
పూలువికసింప పుప్పొడి ♦ రాలు నపుడు
రాలుపుప్పొడిపై గాలి ♦ వ్రాలి, కొలను
కెరటముల దూరి నీటితుం ♦ పరలజేరి
సందు లేకున్న చెట్టుల ♦ యందు నడక
మందగిల వీచుచుండెనా ♦ నందముగను.

దట్టముగ నున్నతీమావి ♦ చెట్టు ప్రక్క
కట్టు బిగియించి విల్లెక్కు ♦ పెట్టి కోల
గొట్ట నుంకించుచుండి గా ♦ చెట్టు పైన
కాచియుండెను బోయ మో ♦ కాలిమీద.

భానునకు స్వాగతంబీయ ♦ బూనినటుల
కూవుమని తాను కూయగ ♦ కూవుమంచు
బాలకుడు వెక్కిరింప మీ ♦ సాలదువ్వ
బాలకా! నన్ను గెల్తువా ♦ పాటయందు
కాచుకొనుమను నట్టుల ♦ కంఠమెత్తి
కూవుకూవని కోయిల ♦ కూయదొడగె
చిగురుటాకుల కరుకెక్కి ♦ చిత్రగతుల
పలుకుగాత్రము తేనెలు ♦ చిలుకరింప.

"తెలియకే పెంచి యుంటిని ♦ దీని తెలిసి
చంపదలచినా"నని ముక్కు ♦ శాఖమీద

గీచి పదునగునట్టుల ♦ రాచి వెనుక
ప్రక్కగావచ్చుచుండెను ♦ వాయసంబు.

చెట్టుపై నున్న పికము రా ♦ చట్టునుంచి
రివ్వుమని వచ్చు కోల గు ♦ ర్తింపలేదు.
కాలపాశము చెంగట ♦ గాంచలేదు.
మృత్యు దేవత ముంగట ♦ మెరయు చుంట
చూడలేదు భవిష్యత్తు ♦ జాడలేదు
వెనుకగా కాకి రాధ్వని ♦ వినుట లేదు
గాన సారస్యమున వేరు ♦ గనుట లేదు.

పాట విని సంతసించెడి ♦ ప్రజలుగాని
తోడు రమ్మన్న మావసం ♦ తుండుగాని
స్వాగతం బందుకొనిన భా ♦ స్కరుడుగాని
యకృతమై వెల్గుచున్నట్టి ♦ ప్రకృతిగాని
చంపబడనున్న పక్షి ర ♦ క్షింప బోరు
గానమును విన్న వారలె ♦ గాని ప్రాణ
ములను గావనొక్కరు గూడ ♦ పూనరయ్యె
నకట పికమ! కృతఘ్నులై ♦ రంచ రిపుడు||

కోలవిడిచెను బోయడు ♦ కోకిలమ్మ
వీపుపై కాకి పొడిచెను ♦ వెనుకతిరిగి
గనక యే ముందు కెగిరెను ♦ గానమాపి
కోకిలము, కాకి చచ్చెను ♦ కోలచేత

అంతయును జరిగె రెప్ప పా ♦ టంతలోన
బోయి నిట్టూర్పు పుచ్చెను ♦ కోయిలయును

చావు తప్పించు కొన్నట్టి ♦ సంబరమున
తీవిగా కూవుమని బరా ♦ టీలు కొట్టి
చంప నెంచిన బోయెను ♦ జావదిట్టి
పెంచి తనకయి ప్రాణమ ♦ ర్పించి నట్టి
కాకినిని నందనము పెట్టి ♦ కవిని మొట్టి
యిచ్చవచ్చిన చోటికి ♦ నెగిరిపోయె॥



# భేదము



క్రోల నొకదాని విడిచి తే • మూలబడెనొ?
దృష్టికందక పోయె—గీ • తికనువిడువ
అదియుపోయె చూపుల దాటి •
యద్భుతముగ॥

కొంత కాలము గడచె—
వృ • క్షాంతమందు
యెందుకొమ్మకు నాటుక • యుండి కోల
తుప్పు పడియుండె—
గీతిక • తొలకరించు
హితుల సంగీతమందు అ • మృతవు చిన్కు
లిపుడు గూడ
రెంటికి సామ్య • మెంచుటేల?





## పరశురాముడు

ఫలములను పూలపచ్చని • పత్రములను
గలిగి జీవంబు వీడు వృ • క్షంబువోలె
అవయవంబుల సౌందర్య • మతిశయింప
ముద్దులనుగూర్చునగు పైడి • బొమ్మవోలె
దైన్యమును, వలత, భయము సౌం • దర్యమహిమ
నడపరేణుక నిలిచె ప్రాణాశ బాసి.

కంటవెడలెడి మంటలు • మింటికెగయ
మొగము మధ్యాహ్నమార్తాండు • పగిదిదోప
కేల శాపోదకంబుల • గీలుకొల్పి
'చంపుడీ దీని లేకున్న • శాప మిత్తు'
నంచు జమదగ్ని ఋషి విక్ర • మించి నిలిచె.

తండ్రి యాకారమును జూడ • తలగ ధైర్య
మయ్యె శాపంబు మదిసెంచ • నడలు పుట్ట
మాతమొగమును గాంచిన • మనసు కరుగ
రేణుకాసుతులుండ్రి ని • స్త్రాణులగుచు

ఖండపరశువు భుజముపై • గ్రాలుచుండ
సమిధకట్టలు మూపుపై • జారుచుండ
నీల నీరద వర్ణుడు • ఫాలనేత్రి
శిష్యుడరుదెంచె మోమున • చెమటనిండ
రాము జూడగనే ముని • తామసంబు
తగ్గి తనయాజ్ఞ రాముడు • దాటడంచు

తండ్రి కోపంబు తగ్గించి ♦ తన్ను గాచు
నంచు రేణుక రాముపై ♦ నుంచె దృష్టి
తండ్రిమాటను రాముడు ♦ దాటునంచు
భ్రాతలందరు సంతోష ♦ భరితులైరి
రాము డరుదెంచి కోర్కెల ♦ ధామమయ్యె
పరశురామాఖ్యు డాశల ♦ పానుపయ్యె

'తల్లి తలద్రుంచి నాకు ము ♦ దంబు గూర్పు'
మంచు జమదగ్ని రాముని ♦ కాజ్ఞయిచ్చె
తాను నిరసింపఁబడిన కో ♦ పాన తక్కు
సుతుల నందరి తనశాప ♦ హతుల జేసె

తండ్రిమాటను పాటింప ♦ దలచు చుండె
తల్లిప్రాణాల రక్షింప ♦ దలచుచుండె
తండ్రియాజ్ఞను మీరుట ♦ తగవుగాదు
తల్లినిఁజంప బూనుట ♦ తగవుగాదు
భ్రాతృశవముల జూచుట ♦ పాడిగాదు
అయ్య కోపకారణమేమొ ♦ అరయలేదు
పరశురాముడు నిశ్చల ♦ భావయుతుడు
తండ్రియాజ్ఞను మీరిన ♦ తల్లిబ్రతుకు
తల్లిజీవించియుండిన ♦ తండ్రికీనియు
తానుజచ్చు నా పైపెచ్చు ♦ తప్పదంచు
తల్లితలద్రుంచి మునికి సం ♦ తసమునించి
శాంతుగావించి వరము యా ♦ చింతునంచు

తండ్రిమాహాత్మ్య మెరిగిన • తనయుడగుట
తపసిశక్తి నెరింగిన • తపసియగుట
తల్లిసుగుణంబు నెరిగిన • తనయుడగుట
పరశురాముడు యోచించి • పరశువెత్తె
తల్లినింజంప, జనకుని • తాపమడప
మరు నిముసమందు రేణుక • మస్తకంబు
పైకెగిరె, క్రిందబడె, దొర్లె, • పరశురాము
డవల గొడ్డలిపడవైచి • అయ్యపాద
ములనుబట్టెను వరమిచ్చి • ప్రోవుమంచు
ముసలిముని సంతసించి తా • మనమునచ్చె
కొమరుపైకెత్తె వరమును • గోరుమనియె
తల్లినన్నల బ్రతికింప • తండ్రిగోరె
పరశురాముడు భగవతిమి • భాస్వరుండు
మంత్రజలములచే వారి • మరలబ్రతుక
జేసి ముని రాముకౌగిట • జేర్చిప్రీతి
రేణుకాదేవి చంద్రికా • రేఖవోలె
మెరసి జమదగ్ని పాదాల • మీదబడియె
రేణుకాసూనులును పున • ర్జీవులగుచు
తండ్రికిని మ్రొక్కి తమ్ముని • దయనుపొగడి
తామె రాముని గతి సల్ప • నోమమనుచు
సిగ్గుపడి ఎగ్గుపడుచు ని • స్తేజులైరి.

తల్లినిఁ జంపె జనకుని • తాపమడచె
వరము యాచించె తల్లిని • బ్రతుకజేసె
అన్నలనుబ్రోచె జగమున • వన్నెగాంచె
పరశురాముడు బంధు కృ • పాకరుండు
పరశురాముడు దుర్మార్గ • భంజనుండు
పరశురాముని సత్కథా • పఠనమిచ్చు
ఫలితమదియేమొ తెలుప మా • వలనగాదు.



# నీవు—నేను



ఆత్మశక్తి మదాశ్రియం ♦ బభిలషించి
నాహృదయపంజరస్థవై ♦ నావు నీవు
నిన్ను నీస్వేచ్ఛతోడ బం ♦ ధించినట్టి
ధర్మహీనుండనగు కిరా ♦ తకుడ నేను॥

బంధనంబందు నుండియే ♦ ప్రణయమహిమ
పలుకు తేనెల నొలికించు ♦ చిలుకవీవు
చిలుక పలుకుల తేనెల ♦ కులుకుజెంది
కట్టి నిను రట్టు బెట్టుము ♦ ష్కరుడ నేను॥

గాఢతమమల్లు కొన్న దు ♦ ర్గమ గుహాంత
రంబునందు వెల్గుచునున్న దీ ♦ పంబ వీవు
దీపమార్పి ఆపయి భీతి ♦ తెన్ను వెతకు
పరమమూర్ఖుండనగు ధూ ♦ ర్తనరుడ నేను॥

భువనశిక్షణ దీక్షాప్రి ♦ బోధిరైన
ఆపరబ్రహ్మ మందొక ♦ యణువు నీవు
అణువునందున్న తత్వంబు ♦ నరయలేక
తడబడుచు సిగ్గుపడని మూ ♦ ర్ఖుడను నేను॥

భవ్యవిజ్ఞానధారాస్రి ♦ వంతిమున్గి
తలచిచూచిన విశ్వమం ♦ తయును నీవు
దుర్దమదురంత దుస్సహ ♦ దురితవహ్ని
పడితపించుచు నున్నట్టి ♦ మిడుత నేను॥



## సు ఖ జీ వి




చ్ఛగా సౌఖ్యముగనెట్లు ♦ జీవనంబు
చేయుటంచును బిట్టుయో ♦ జించుకొనుచు
గుంపులుగవచ్చు తలపులు ♦ కూడరాగ
ఊరిబయటికిబోతి షి ♦ కారుగాను.

అదిప్రశాంతసమయము, అది ♦ యామినీస
తీప్రభవవేళ అదియె న ♦ దీతరంగ
డోళికాపాళికలపిల్ల ♦ గాలులూగు
కాల, మదిసంజకెంజాయ ♦ లేలువేళ

ఆరుగంటలు దాటెను ♦ ఆననమున
చెమటచే నచ్చుటచ్చుట ♦ చెరిగియున్న
పంగనామంబుతో నొప్పు ♦ ఫాలమందు
జీవకళ యొందు నృత్యము ♦ సేయుచుండ
నలుపుగానుండిగూడ కో ♦ మలతజూపు
అంగసౌష్టవమందు ఒ ♦ య్యారముండ
ఎడమభుజమున తట్టయు ♦ ఎడమచేత
పలుగు, కుడిచేత పార యొ ♦ ప్పారుచుండ
కష్టజీవియటంచు లో ♦ కంబుతలప
పగలు కూలికినై పాటు ♦ పడినకష్ట

మలసటయు సుంతయేనియు ♦ తలపకుండ
పోవు ఉప్పరమనిషి నా ♦ తోఁ బ్రివనడె

"ఎటులజీవింతువోయి? నీ ♦ కెప్పుడేని
సుఖమనెడిమాట తోఁచునే ♦ సూర్యుతోడ
కష్టపడుచుందు వొకనాడు ♦ గాని నీవు
తృప్తి, స్వేచ్ఛలనందెదే ♦ తెలుపు"మనిన
పలుగు,పారయు, తట్టయు ♦ పదిలముగను
వసుధపైనుంచి యిట్లు జ ♦ వాబుచెప్పె

"కష్టపడి, కూలిచేసి నా ♦ కలను తెచ్చి
కాచుకొని తిని తృప్తిని ♦ గాంచగలను
తృప్తిలో తేలియాడున ♦ దేసుఖంబు
కష్టజీవియె నిత్యసం ♦ తుష్టిగాంచు
కాయకష్టంబులోన సౌ ♦ ఖ్యంబుగలదు
పరులసౌఖ్యంబులోన మా ♦ బ్రతుకుగలదు
పరులసుఖదుఃఖముల మాకు ♦ పాలుగలదు
పరులు బాగుగనున్న లో ♦ పంబు లేదు
పరులకై కష్టపడుట మా ♦ భాగ్యమయ్య
సప్తవార్ధిమేఖల భూప ♦ చంద్రుడేని
సౌఖ్యమందుటలో మాకు ♦ సాటిరాడు
పలుగు, పార, గొడ్డలి, కుండ ♦ పర్ణశాల
కంబళియుమాకుగల ఆస్తి ♦ కరకుమెతక
కాననతలంబులే మాకు ♦ కాపురములు

ఒకరియాధారమున నిల్చి ♦ యుండబోము
ఒకరిహస్తంబునకు లొంగి ♦ యుండబోము
యిష్టమైన కష్టింతుము ♦ కష్టమైన
మానుదుము, మాదుస్వేచ్ఛ కే ♦ మాత్రమేని
భంగముండదు, మాకెప్డు ♦ భయములేదు
కాయమా! వృద్ధిగాంచు, ని ♦ ష్కపటమార్గ
ములను చరియించుచుండుమా ♦ బుద్ధులెపుడు
ఆత్మసంతుష్టిజెందు, అ ♦ న్యాయముగను
పరులబాధించి పాపంబు ♦ పాలబడము
మాకులోపంబులేదు, ఛీ ♦ కాకులేదు
ఆశకా! తావులేదు, ని ♦ రాశలేదు
సత్యదూరంబుగాదు, ని ♦ శ్చలతపోదు
డంబమా! లేదుమాకు వే ♦ సంబునందు
కష్టసుఖములభేదమే ♦ గనముమే" మ
టంచుసెలవంచు తనసొమ్ము ♦ లన్నిమరల
తీసికొనిపోయె నతడా ప్ర ♦ దేశమువిడి

అతని పల్కులలో పాడు ♦ అమృతధార
అతనిముఖమండలంబునం ♦ దాడెడికళ
అతని కన్నులయందు నృ ♦ త్యంబుసల్పు
తేజమతడేగినను గూడ ♦ తిరుగుచుండె

"కష్టజీవికి గాని సు ♦ ఖంబులేదు
కష్టజీవనమందున ♦ కలదుస్వేచ్ఛ"

యనుచు నతడన్న పలుకుల ♦ మనుచుశక్తి
తీవ్రముగ మాటమాట ప్ర ♦ తిధ్వనించె॥

అతనిమాటల అర్థంబు ♦ నరయలేదు
గాని ముందాడు శక్తిని ♦ గన్నతోడ
"ఈవె సుఖజీవివో ఉప్ప ♦ రి!" యటంచు
తలచుచును పోయినాడ నా ♦ వారినేను
కాని తలచినమాత్ర సా ♦ క్షాత్కరించు
ఆమహాత్ముండు సుఖజీవి ♦ అమలగుణుడు
ఆత్మసందేశవర్తి, స ♦ త్యస్వరూపి.



# ఏల? గోపాలబాల



చెంతరమ్మని ప్రార్థింప • చేరరావు
తలఁచి మొఱబెట్టి పిలిచిన • పలుకబోవు
సుఖము లందుచున్నప్డును • చూడరావు
కష్టదశలందు కనులకు • గానబడవు
ప్రాణముల నీకొసంగి న • ప్పటికిగూడ
జాలిజెందవు; సుంత వి • చారపడవు.

రాధకనుబొమ ముడుచు మా • త్రానపోయి
మ్రొక్కి, యంజలిఘటియించి, • ముందునిలిచి,
ప్రార్థనలసల్పి, బ్రతిమాలి • పలుకరించి
బుజ్జగించి లాలించిన • “ పో ” మ్మటంచు
నిరసన మొనర్చినను గూడ • నిష్టతోడ
పాదముల నొత్తెదేల? గో • పాలబాల!



## ఏనాటి ఋణములో



పెరుగును పాలువోసి కడు ♦
ప్రేమదలిర్పగ పెంచినన్ను నా
కరములలోన బెట్టిరి సు ♦
ఖంబుగనుండుపటంచు నమ్మి ముం
దరయగ నేమికానగునొ ♦
అంతయునీదె యదృష్టమౌను తా
పరమదరిద్రుడైన తన ♦
భార్యభరించి సుఖంబుజెందడే?

పెండిలియైన వత్సరము ♦
వెళ్ళగలేదు సగంబు భర్తతో
నుండవు; కష్టమో సుఖమొ ♦
నొందిన స్వానుభవంబు లేదు; భూ
మండలిలో సతీపతుల ♦
మాదిరి ప్రేమలతానుబంధమో
అండజయాన! నీవెరుగ ♦
వట్టి పడంతికిదేటి చింతయో?

కలికీ! అత్తయు, నీదు పెన్మిటి తనం ♦
గా లేక నీవాడవా
డలు ముష్టెత్తుచునుండగా మగనియం ♦
డక్కలేని సంతాపమో

తలిదండ్రుల్ కడుబీదవాని నొకనిన్ ♦
దాకొల్పినా రంచెదన్
దలపోసింతటి యార్తిజెందెదో మెలం ♦
తా! వేరు నూహించెదో?

"అనఘా! దైవమ! నన్ను గోత నిటుల ♦
న్యాయంబుగా దోచి నా
కెనలేనట్టి యశాంతి నెమ్మనమునం ♦
దీరీతి కల్పించి జీ
వన భాగోదయ మెల్ల మంట గలుపన్ ♦
భావ్యంబుగా నెంచితే?"
యని దుర్దాంత దురంత దుఃఖమున రా ♦
మా! వేరు నూహించెదో?

గారాబంబున పెంచుటన్ మిగుల సౌ ♦
ఖ్యంబంది యున్నాళ్ళు మా
యూరన్ చీకును చింతలే కొకట నే ♦
దో రీతిగా నున్న న
న్నారా! తిండికి లేక కష్టములతో ♦
నల్లాడు నిర్భాగ్యులన్
జేరంబంచె విధాత యంచు మదిలో ♦
జింతించెదో కోమలీ!

"వనజాస్యన్ సుకుమారి చారుకుసుమ ♦
ప్రాయంపు శాతోదరిన్

వినయ శ్రీనిధి జేకొనంగ మది ను ♦
ప్పొఘ్యారి యీనాటి కో
వనితా! నిన్ను పరిగ్రహించెడి మహా ♦
భాగ్యంబు చేకూరెనా”
కని గర్వోన్నతి మిన్నుముట్టితిని నే ♦
నత్యంత హర్షంబునన్॥

ఇంతి___ఏనాటి ఋణములో ♦ ఎవ్వడెరుఁగు
ఎక్కడెక్కడి వారినో ♦ ఒక్క చోట
కూర్చి సుఖదుఃఖములు జెందు ♦ కొరకు ధాత
అనుభవింపక తీరునే ♦ అంబుజాక్షి!



## నిరాశ — ఆశ



అనుదినంబును నే నుద ♦ యంబునందు
నురుతరాటవీస్థలముల ♦ దిరుగుచుండి
కట్టెలనుగొట్టి తెచ్చి యీ ♦ గ్రామములను
పట్టణంబుల యందమ్మి ♦ బ్రతుకుచుండి
కష్టముగజీవయాత్రను ♦ గడుపుచుంటి
గాని యిసుమంతయేని సౌ ♦ ఖ్యంబునున్న
యెంతవెదకిన లేదు మా ♦ ర్గాంతరంబు
ఒకటితలచును తా దైవ ♦ మొండుతలచు
పలుతెరంగులు స్వానుభ ♦ వంబునందు
జరుగునది లేదు జీవితా ♦ శయముమారు
దైవసాయంబులేని య ♦ త్నంబులెన్ని
యైన నిష్ఫలప్రాయము ♦ లనియందు
బ్రతికి సార్థకమేమి ప్ర ♦ పంచమందు
ననుచు చింతించుచుండి నె ♦ మ్మనముకలత
వార తత్పర్వతారణ్య ♦ పరిసరముల
క్రుమ్మరుచునుంటినేవియో ♦ గొణుగుకొనుచు
పాడుపడికొయ్యయై జడ ♦ త్వమునుదాల్చి
యుడుకుచుండెను హృదయమ ♦ ట్టుడికినట్లు
కటికచీకటిదోచె లో ♦ కంబులేదు
అదెవినీల నిర్మలాభ్ర ♦ మందునీల
కాంతిగాని, అడవిపూల ♦ వింతరుచులు
గాని, మలయానిలుండైన ♦ గాని, కడకు

తక్కఁగలయట్టి సృష్టిచి ♦ త్రములుగాని
శాంతభావంబు చేకూర్ప ♦ జాలకున్న
పుత్రికా! నీవు దుఃఖంబు ♦ పొందనేల?
వ్యక్తమయ్యెను నీమనో ♦ భావమిదియె
అనుసరింపు నన్ను పర్వ ♦ తాగ్రమునకు
జాగు చేయకుమను పురు ♦ షస్వరంబు
మృదులగంభీరభావముల్ ♦ మేళవించి
పిలిచినట్టులతోఁచినే ♦ నిలువబడితి
కలయఁ జూచితినల్దిశల్ ♦ కనుల యెదుట
విమలకాషాయవస్త్రము ♦ లమరదాల్చి
చారుతరమూర్తి యొకఁడు సా ♦ క్షాత్కరింప
వెడలినాఁడను వాని వె ♦ న్వెంటతగిలి
యెక్కితిని కొండకొనకు త ♦ దేకదృష్టి
చూడ నియమించె నాతండు ♦ చూచునంత
వాయుగతి పారు కాల ప్ర ♦ వాహమందు
కలదు జీవితం బనెడడ్డు ♦ కట్టయొకటి
శిథిలమైపోయె నయ్యది ♦ చిట్టచివర
ద్వేషము, ధనాశ, భ్రాంతి, సం ♦ తృప్తిలేమి,
అనృత, మన్యాయవర్తన ♦ మను గ్రహంబు
లతిభయంకరముగ దాని ♦ నావహించి
నరులుకట్టపైనటునిటు ♦ నడుచుచుండ
నీటిలోనికి కొందరి ♦ నెట్టుచుండె
కాలముగతింపగా నా ♦ యగాధమందు
బడుచునుండిరి కొందరు ♦ వారిలోన

భవ్యులెవ్వరో కాల ప్రి ♦ వాహమునకు
నంతమందునగల్గి ప్రి ♦ శాంతమైన
దీవిపైనొక్కరొక్కరే ♦ తేలుచుండ్రి
తరగతులువారివారికి ♦ తగినయట్లు
సర్వసౌభాగ్యములజెంది ♦ సౌఖ్యమంది
సతము స్వేచ్ఛా విహారంబు ♦ సలుపుచుండ్రి
ప్రివిమలోదకపానంబు ♦ పక్షిగముల
కిలకిలారావ సువ్యక్త ♦ లలితమధుర
భవ్యశుభ గీతికారసా ♦ స్వాదనంబు
స్వాంతమలరించు పొదరిండ్ల ♦ చెంతజేరి
యనుభవించుచునున్న యో ♦ అయ్యలార
రెక్కలైనను లేవె మీ ♦ ప్రిక్కజేర
అనుచు చింతించుచున్న య ♦ య్యనఘుడపుడు
వారిచేరగ వారి ప్రి ♦ వర్తనంబె
వేరు మార్గంబులేదు వి ♦ చారమేల
యనుచు నుడివిన నీప్రి వా ♦ హాదియందు
గలుగు దీవిని నెవ్వరు ♦ గలరుచూపు
డనుచు బ్రతిమాలగా నాము ♦ హాత్ముడట్టె
మాయమయ్యె నాదృశ్యంబు ♦ మారిపోయె
నడవి కట్టెలు మరల ప్రి ♦ త్యక్షమయ్యె॥



# నీ తరువాత



చందమామవెలుగు బావా!
చక్కగావున్నాది బావా!
అంతకన్న నీ నవ్వు పిల్లా!
హాయిగా వున్నాది పిల్లా!

అంతులేని యీసంద్రం బావా!
ఎంత లోతుంటుందో బావా!
నీ హృదయంముందు పిల్లా!
నేలమట్టం సంద్రం పిల్లా!

గండుకోయిల పాట బావా!
కమ్మగా వున్నాదిబావా!
నీ మాటల ముందు పిల్లా!
నిలువదాగానమ్మ పిల్లా!

మూడు మూర్తుల రూపులు బావా!
ముద్దుగా వున్నాయిబావా!
ముద్దులొలుకు నీ రూపు పిల్లా!
మూర్ఛ దెచ్చేనేమో పిల్లా!



# శ్రీకృష్ణలీల

—గొల్లపిల్ల.—




టరిగానుంటె నా
యెంటబడతాడమ్మ
పదిమందిలో తల
పైకెత్తడమ్మా॥

యశోద— యింత దుందుడుకోడు
యెవ్వడే పిల్లా!
అంతచేసినవాణ్ణి
అట్టె పెడతానా॥

గొల్లపిల్ల— నీకన్న కొడుకమ్మ
శ్రీకృష్ణుడమ్మా॥

యశోద— ఏమిరా కృష్ణయ్య
యీతులువతనము
పడుచులందరికీవు
పగవాడవేనా?

కృష్ణుడు— యెన్న పెడతానంటె
యెంటెల్లినానె
పడుసుల్తొ బాలుడికి
పగయెందుకమ్మా?

# మాయమ్మ



మాయమ్మ మాకిత్తువా?
అమ్మకై పూదండ
లల్లు కొని వచ్చాను
అందులో సగభాగ
మాశపెడు తున్నాను
మాయమ్మ మాకిత్తువా?
దైవమా!
మాలలన్నియు నిత్తువా!

ఆకలౌంతుందమ్మ
అన్నమే యంటేను
అయ్యో! నాయన యంచు
ఆదరించే యమ్మ
నగు పడక పోనిత్తువా?
దైవమా!
అన్యాయ మొనరింతువా?

అమ్మపై కొండాల
నయ్యతో చెప్పాలె
ననుకొంటె మాకట్టి
యదను లేకుంటుంది

అమ్మ నెత్తుక పోదువా?
మమ్మల్ని
ఆటలాడగ నీదువా?

చిన్ని పిల్లల మీది
ప్రేమ మాపై లేదు
అమ్మమ్మ కిపుడు మా
యమ్మ లేకుంటేను
అట్టి పాశ్చిక భావముల్
దైవమా!
ఎట్టులో భరియించుటల్?

మీాయమ్మ భాగవత
మిప్పి చెపుతూ వుంటె
కన్నులకు కృష్ణయ్య
కనుపించు తాడంచు
మేనత్త లంటారుగా!
ఆకథలు
మేము వినగా లేముగా॥

మామయ్య కూతుళ్ళు
మాయత్త యేదంటె
మారు మాటేలేక
మనసునీరౌతాది

మాలోపమునుదీర్చవా?
దైవమా
మమ్ముల్ని కడ తేర్చవా?

రైకబొడ్డునదోప్పి
రాలుస్తుకన్నీళ్లు
నాస్నాతకపువేళ
నాన్నకూర్చోవాలె
లోకులందరిచూడవా?
ఆలాగె
నాకుపెళ్లినిచేయవా?

అమ్మనుజూపరా
అన్నయ్యయంటేను
తమ్ముళ్లతో నేను
తగవాడగాలేను
మాయమ్మమాకిత్తువా?
దైవమా!
మాపోరులడగింతువా?

అమ్మయేదేవుళ్లు
కపుడు మొక్కిందోను
అవిదీర్చగాలేక
అగచాట్లుపడతాము

అవిమాకుచెప్పుమంచూ
కోరెదము
అమ్మ నొకసారంపుమంచూ.

అమ్మ నీరూపులో
ఐక్యమైపోయింది
అమ్మాయనేమాట
హరియించిపోయింది
అమ్మ నెత్తుకపోతివా?
భాషకే
యపకారమొనరిస్తివా?

అమ్మ నాకేదంచు
అడుగుతావేమోను
నీకు లేదని మాకు
నిరసింపన్యాయమా?
ఉన్న వారిని వేఁల్చుటా?
దైవమా!
నిన్ను మాతో పోల్చుటా?

తల్లి లేకుంటేను
తనువు లేదంటారు
తనువు లేకున్న భూ
తపురూపమైతినా

సందేహముల్ దీర్తువా?
దైవమా!
జననిలోటునెదీర్తువా?

(2) అనుభవిస్తున్నానురా

మంచుగప్పినపూల
మాలలన్నియు గూర్చి
వాటితోటెఅమ్మ
మాటమరుతామంటె
దుఃఖంపు కెరటాలురా
దైవమా!
దొర్లుకొని వస్తాయిరా.

యెనకజన్మంలోన
యేతల్లిపిల్లలకు
యెడబాటు గల్గించి
యేడిపిస్తినోగాని
అదె యెదురుగొడతాదిరా
దైవమా!
అనుభవిస్తున్నానురా.

మాతృకారుడు చంద
మామ రాహువు జూడ
కుంభాన కేతువుతో
కూర్చుండె నారింట

ననిజోస్యులంటారురా
అందుకీ
యనుభవంబంటారురా.

మీయమ్మ యేదంచు
మిత్రులడిగేటప్పు
అమ్మ యెట్లుంటుందో
అసలే యెరుగమంచు
తమ్ముళ్లు చెపుతారురా
కడుపప్పు
తరుగుకొని పోతుందిరా.

కోడలెక్కడ యంటు
కొత్తవాళ్ళడిగితే
బామ్మకన్నీళ్ళతో
బదులుచెప్పేటప్పు
గుండెనీరైపోవురా
దైవమా!
మొండిజీవితమేలరా.

దేవతార్చనపెట్టె
తీసి తాతకునీయ
పులిగాపు జేస్తునే
పూజించి నట్లుంటె

అమ్మభక్తిని జూతురా
నీమీద
ఆశలప్పుడు పుట్టురా.

గోమాత దరికొస్తె
గోకుతూ లాలిస్తు
తల్లిపిల్లల్లాగు
తరలివస్తుంటేను
అమ్మదయనపుడెంతురా
దయయంటె
అర్థమైపోతుందిరా.

ఏలోపముల్లేని
యిరువులెన్నున్నాను
గొప్పకొరతొక్కటే
గోచరిస్తుంటాది
దానితీర్చుటయెట్లురా?
మనసుకది
తట్టుకుంటున్నాదిరా.

ఆటల్లొమరిగున్న
ఆనందసమయాన
ఆచరించినయట్టి
అపరాధములసంఖ్య

అన్నిటికి ఫలమిద్దిరా
దైవమా!
అనుభవిస్తున్నానురా.

శివరాత్రియాత్రికై
శ్రీశైలమెడుతుంటె
అమ్మమ్మ మారుపడ
అమ్మ యేడుస్తుంటె
అదిచూచినవ్వానురా
దైవమా!
అనుభవిస్తున్నానురా.

మాయమ్మ లేకుంటె
మాకుదిక్కేదంటు
మాపొరుగుమంగమ్మ
మరిగిపోతుంటేను
అదిచూచినవ్వానురా
దైవమా!
అనుభవిస్తున్నానురా.

బళ్లోకిపోవుటకు
బద్ధకంబుడితేను
సెలవుకై అమ్మమా
సికమంచుబొంకాను

అదినిజంబై పోయెరా
దైవమా!
అనుభవిస్తున్నానురా.

విసిగించి విసిగించి
వేధిస్తువుంటేను
నేజచ్చినాకలే
నీపాట్లనుచుఅమ్మ
అనుటనిజమైపోయెరా
దైవమా!
అనుభవిస్తున్నానురా.

కాసేపు కూసేపు
కాదు యీ అనుభవము
కడతేరి నీలోన
కలిసి పోయే దాక
కలక వేయుచునుండురా
దైవమా!
కడుపుమండుచునుండురా.

(3) అదెనాకుసంతృప్తిరా

పూల దండల నిచ్చి
పూజించినా గాని
అమ్మకై నేనె రా
వాలె నంటున్నావు

ఆరీతినోనరింతురా
దైవమా!
ఆ సమయముం జూపరా.

"వేరేవిధంలేదు
వెర్రిదుఃఖమిదేల
సంతృప్తిజెప్పుకొని
సౌఖ్యపడవో" యంచు
ఆజ్ఞయిప్పిస్తావురా
దైవమా!
అలాగె చేస్తానురా.

గుళ్లోకి బోయి దు
ర్గకు మొక్కుతూ వుంటె
ఆదేవి రూపులో
అమ్మ గనిపిస్తుంది
అదె నాకు సంతృప్తిరా
దైవమా!
అదెయమృతపు వేళ రా.

మాదొడ్డ యిల్లాలు
మాలక్ష్మి మాయమ్మ
అని పొగుడువారు అ
మ్మను పొగడుతూ వుంటె

అదె నాకు సంతృప్తిరా
దైవమా!
అదె యమృతపు వేళరా.

పెద్ద పిన్నమ్మ నన్
పిల్చి లాలిస్తుంటె
అమ్మ గాంభీర్య మపు
డగుపించుచూ వుండు
అదె నాకు సంతృప్తిరా
దైవమా!
అదె యమృతపువేళరా.

చెల్లాయి వీణె నా
చెంత వాయిస్తుంటె
అమ్మ మాట్లాడిన
ట్లాగె వినిపిస్తాది
అదె నాకు సంతృప్తిరా
దైవమా!
అదె యమృతపు వేళరా.

పెద్ద మామయ్య నన్
పెద్దగా కొనియాడ
అమ్మ పరహిత వాంఛ
యపుడు కన్పిస్తాది

అదెనాకు సంతృప్తిరా
దైవమా!
అదెఅమృతపు వేళరా.

కృష్ణయ్యను యశోద
కూక లేస్తునట్లు
చదువుతుంటే అమ్మ
జ్ఞాపకం వస్తుంది
అదెనాకుసంతృప్తిరా
దైవమా!
అదెఅమృతపు వేళరా.

వెన్నెల్లో చల్లగా
విసరు గాలులుసోక
అమ్మ నవ్వుతునన్ను
అంటినట్లుంటుంది
అదెనాకు సంతృప్తిరా
దైవమా!
అదె యమృతపు వేళరా.

కృష్ణా నదికిపోయి
కెరటాలు చూస్తుంటె
చేయెత్తి అమ్మపి
ల్చిన యట్టులుంటాది

అదేనాకు సంతృప్తిరా
దైవమా!
అదెయమృతపు వేళరా.

ప్రకృతిలో నేదైన
పరికిస్తువుంటేను
అమ్మ గుణమేదోయం
దగుపించుతూవుండు
అదేనాకుసంతృప్తిరా
దైవమా!
అదెయమృతపు వేళరా.

నవ్వు మోముతో నాన్న
నా యెదుట కనిపిస్తె
అమ్మ మాటేమరచి
ఆనంద పడుచుండు
అదేనాకు సంతృప్తిరా
వేడిక్రో
లంతమై పోయిందిరా,



గు రు ద క్షి ణ

# ఆ హ్వా నం యే ర్పా ట్లు



ల్లుడొచ్చా పిల్లావచ్చా
ఆరితోయియ్యంకుడొచ్చా
అరిసెలైనా వండిపెట్టాలే
నాసిలకరాణీ!
ఆవుపాలుతోడుపెట్టాలే.

సులకకుక్కిదులిపియుంచీ
సున్నగాగోతామపరిసీ
నూలుపిల్లూతలగడెయ్యాలే
నాసిలకరాణీ!
నువ్వునాతోకలసియుండావే.

సంపూర్ణము.



రాఁబోవు గ్రంథము

# చక్కని పెద్ద నవల

---

కారణాంతరములచేఁ బేరిప్పుడు తెలుపఁజాలము. చందాదారులఁగుట కిదియే తరుణము. చందా సాలు 1కి ను 3.0-0 లు మాత్రమే.

ఇట్లు,
వ్యవస్థాపకుఁడు.

రాఁబోవు గ్రంథము

# చక్కని పెద్ద నవల

---

కారణాంతరములచేఁ బేరిప్పుడు తెలుపఁజాలము. చందాదారులగుట కిదియే తరుణము. చందా సాలు 1కి రు 3.0.0 లు మాత్రమే.

ఇట్లు,

వ్యవస్థాపకుఁడు.